# గాంధీమహాత్ముని కల్యాణగుణాలు

[ప్రఖ్యాత చిత్రకారుడు ... క్లేయార్ ఈ ప్రత్యేక వ్యాసములో మహాత్ముని విషయమై తన భావములను వర్ణించుచున్నది.]

గాంధిమహాత్ముని విగ్రహమును తయారుచేసి దానిని అ. భా. గ్రామ పారిశ్రామిక సంఘమునకు బహూకరింప నేను వాంఛించియుంటిని. తన ప్రతిమను నేను తయారుచేయుటకు మహాత్ముఁ డంగీకరించియుండెను. రాట్నముపై నూలువడకుచున్నప్పటి గాంధిమహాత్ముని సంపూర్ణ విగ్రహమును నేను తయారుచేయ నుద్దేశించియుంటిని.

జనవరి మాసాంతమున నేను వార్ధాచేరితిని. నాకొరకై బంకమట్టిని తీసికొని వచ్చిరి. నా ఆదేశముల ననుసరించి వడ్రంగి ఒక చిన్న బల్లను, సంపూర్ణ ప్రతిమకుగాను లోకట్టుచట్టమును తయారుచేసెను. వెంటనే నేను ప్రతిమ రూపరేఖలను రచింప నారంభించితిని. నేనిట్లు చేయుటకుగాను మహాత్ముని స్థానమున నొకడు ఓపికతో కూర్చుని యుండెను. అతని భుజములమీదిదుస్తులను, రాట్నచక్రముపై అతని చేతులను, ముంజేతులను నేను రచించితిని. అతని కాళ్ళు చాలా బిగబిగిసియుండెను. నూలువడుకు నప్పుడు మహాత్ముడు యోగాసనము వంటి ఆసనములో కూర్చుని కాళ్ళు ముడుచుకొనియుండును. కాని ఈతని కాళ్ళు అట్లుగాక చాలా బిఱ్ఱబిగిసియుండెను.

ఫిబ్రవరి శివ తేదీనమహాత్ముడుసేవాగ్రాం వచ్చెను. ఆయన మగన్‌వాడీకి (అ. భా.) గ్రామ పారిశ్రామిక సంఘ ప్రధాన కార్యస్థానము నేను పని ప్రారంభించిన చోటు) రాడను విషయము స్పష్టమైనప్పుడు మహాత్ముని నివాసమగు సేవాగ్రామమునకు వెళ్ళనివ్వవలసినదని ప్రార్థించి, అప్పటివారి అనుమతి గైకొని మూటముల్లె కట్టుకొని నా ముద్దుల శిశువుతో బయలుదేరి వెళ్లితిని. అంతవరకు నేను తయారుచేసిన మహాత్ముని ప్రతిమ తరువాత ఎద్దు బండిలో రావలసియుండెను. అనుకొన్న దానికంటే నాలుగు రోజులు ముందే మహాత్ముడు సేవాగ్రామమునుండి బయలుదేరి వెళ్లునని, నాపని పూర్తిచేయుటకు 7 రోజులు వ్యవధిమాత్రమే యుండునని సేవాగ్రామం వెళ్లగానే నాకు తెలిసెను. నేను త్వరగా పనిచేయుదానసే. ఐనప్పటికి నాకు ఆందోళన కలిగెను. దురదృష్టవశమున ఆసమయమున నేను చాలా డస్సిపోయియుంటిని.

## మహాత్ముని దర్శనము

మధ్యాహ్న భోజనమైనతరువాత ఆశ్రమములో, మట్టితో నిర్మింపబడిన మహాత్ముని కుటీరము ప్రవేశించితిని. అచ్చట చామనచాయ రంగుగల ఒక వామనమూర్తి, కొల్లాయిగుడ్డతప్ప శరీరమునకు వేరు ఆచ్ఛాదనలేని వ్యక్తి, గాంధిమహాత్ముడుండెను. ఆయన నన్ను మందహాసభాసుర వదనారవిందముతో ఆహ్వానించెను.

'ఎవ్వరి కీర్తి నాకు విస్తారంగా శ్రుతమయ్యెనో ఆ శిల్పాచార్యులు మీరేనా' అని ఆయన ప్రశ్నించెను. 'మీ విషయమై నేను యింకా యెక్కువగా వింటిని' అని నేను త్రికరణశుద్ధిగా నే సమాధానము చెప్పితిని.

'మీ విషయమై నేను చాలా వింటిని' అని ఆయన మరల దరహాసచంద్రికలు నాపై బరపుచునసెను.

'ఐరోపాఖండములో మీ విషయమై అంతగా వింటిని' అని నాచేతిని ఒకగజము పైకెత్తి యంటిని.

'అంత ఉన్నతుడనని నేను, చెప్పజాలను. రోజంతయు, అన్నము తినుచున్నప్పుడు, ఇతరులను కలసికొని మాట్లాడునప్పుడు మీరు నన్ను చూడగోరుచున్నారు కాబోలు, అని నవ్వుచు వచించి యింకా యేమో చెప్పబోవుచుండగా నేను అడ్డుతగిలి 'మీరు పనిచేయునప్పుడు, నూలు వడుకునప్పుడు, నిద్రపోవునప్పుడు. ఒళ్లు పట్టించుకొనునప్పుడు మిమ్ములను చూడగోరుచున్నాను' అని యంటిని.

'ఒళ్లు పట్టించుకొనునప్పుడు నన్ను మీరు చూచు అవకాశముండదు. ఎందువల్లననగా, అప్పుడు నేను సంపూర్ణముగా దిగంబరుడనై యుండెదను' అని మహాత్ముడనెను.

'ఫరవాలేదు. వస్త్రహీనులైన స్త్రీలను, పురుషులను అనేకులను నేను చూచితిని' అని నేనంటిని.

'ఐన మీరు దిగంబరుల ముఠాకు చెందినవారా? అని మహాత్ముడనెను.

'కాదు. ఐనప్పటికి మేము కళోపాసకులము. ఇతరులు పుష్పముల యొక్కయు, వృక్షముల యొక్కయు అందమును జూచి యెట్లానందించెదరో మేము మానవశరీరమును జూచి యట్లానందించెదము. అరణ్యములలో నేను వస్త్రవిహీననై తిరిగితిని. ఎవరైనా కనబడినయెడల ధరించుటకు స్నానము చేయునప్పుడు ఉపయోగించు బట్టలను మాత్రము నాతో తీసికొని వెళ్లుచుంటిని' అని సమాధాన మొసంగితిని.

'ఐతే మీరు నగ్నముగానే వుండనెన్న మాట' అని మహాత్ముడనెను.

'నాకు పిల్లలు కలుగుట యిరువదేండ్ల కొందరో ననియే. దిగంబరిగా తిరుగుట దోషమని నేను తలంపను.'

'మీరు చెప్పినమాట నిజము. కాని ఈ పల్లెపము నింటటితో కట్టిపెట్టెదము. మీ యిష్టము వచ్చినప్పుడు యిచ్చుటకువచ్చి మీ యిష్టమువచ్చినట్లు చేయ నాకనుమతి కలదు.' అని మహాత్ముడనెను.

నేను కృతజ్ఞతా పూర్వక వందనము లర్పించితిని.

'నాకు పని విశేషముగా నున్నది. కనుక మీతో నేను యెక్కువగా మాట్లాడను. మీరు నా ప్రతిమను తయారుచేయుటకై కూర్చొనను. ఎవ్వరి కొరకైనను, ఫోటోలు తీయువారి కొరకు సైతము నేను కూర్చుండను. మీరిచ్చటనుండవచ్చును, లేదా వెళ్ళవచ్చును. మీ యిష్టము వచ్చినట్లు చేయుడు' అని మహాత్ముడనెను.

'మీకు కృతజ్ఞురాలను' అని మరల నంటిని. అంతట మహాత్ముడు నావద్దనుండి వెడలిపోయి ఒక దస్తరములోనుండి లేఖలనుతీసి, వానిని చదువుకొనుటలో నిమగ్నుడై యుండెను. సంపూర్ణ విగ్రహమును పూర్తిచేయుట దాదాపు అసంభవమను విషయము స్పష్టమగుటచే నేనచ్చట కొన్ని నిమిషములపాటు మౌనంగా ఆలోచనాసాగరమున మునిగితిని. నమస్కార పురస్సరముగా ఆయనను వదలి వెళ్లితిని. ప్రతిమనుండి ఊర్ధ్వకాయమును వేరుచేసి మొదట మంచి చిత్తరువు తయారుచేయ నిశ్చయించుకొంటిని. తరువాత వ్యవధి యున్నయెడల విగ్రహమును తయారుచేయ దలచితిని.

అమూల్యమైన యింకొక రోజు గడచిపోయెను. కాని మగన్‌వాడీనుండి విగ్రహము రాలేదు. ఏమి జరిగి యుండునను? మధ్యాహ్నసమయమున గాంధిమహాత్ముని రూపరేఖలను కనుగొనుటకు ఆయన నూలు వడుకు గదిలోనికి వెళ్లితిని. నన్నాయన చూచినప్పుడు మందహాస చంద్రిక లాతని ముఖమండలమున తాండవించుచుండెను. సాయంత్రము నాకు ఫోనులో ఈ క్రింది విధముగా చెప్పిరి. "చాలా బరువుగా నుండుటవల్ల ప్రతిమను ఎద్దుబండిలో పంప

## క్లారా క్వియాను

వీలుకాలేదు. ఒక లారీనితెచ్చి దానిలో విగ్రహమును సేవాగ్రాం పంపుటకు చాలామంది అధికారుల అనుమతి గైకొనవలసి వచ్చెను. నేటిరాత్రి అది చేరును."

వారుచెప్పినట్లు అది ఆరాత్రి చేరెను. మరుసటి ఉదయము మహాత్ముడు స్నానముచేసి బయటికి వచ్చినప్పుడు ఆయన గది వెలుపల నాకు ఆసన మేర్పరిచిరి. వెంటనే నేను పనిచేయ నారంభించితిని. మధ్యాహ్నము ఆయన నిరంతరముగా వడుకుచుండెను. మేమందరము తదేకధ్యానముతో పనిచేసితిమి. ఆయన ప్రతిరూపము కనబడ జొచ్చెను. 'ఈరూపము మీకు యిష్టముగా నున్నదా' యని ఆయన ఆ ప్రదేశమును వదలి వెళ్లుటకు పూర్వ మడిగితిని. 'మీరు కోంచేము తంటాలు పడ్డారు' అని ఆయన సమాధాన మొసంగెను. ఆయన సహజముగా, కృత్రిమమేమాత్రము లేకుండా; నిష్కపటముగా మాటలాడును. ఆయన వాక్యములు హృదయమునుండి వచ్చినవిగా నుండును.

## రామనామసంకీర్తన

ఆనాటి సాయంకాలము నేను సామాజిక ప్రార్థనలకు వెళ్లితిని. గతరాత్రి నాకు దూరమునుండి వినబడిన మృదుమధుర గానము నా హృదయము నాకర్షించియుండుటచే నేను వెళ్లితిని. జనసమూహము చిన్న చాపలపై ఉపవిష్టులై యుండిరి. గాంధి మహాత్ముని ఎడమ పార్శ్వమున స్త్రీలు, కుడిపార్శ్వమున పురుషులు, ఆయన యెదుట గాయకులు ఆసీనులై యుండిరి. మొదట వారు తగ్గు స్థాయిలో పాడిరి. తరువాత స్థాయి హెచ్చెను. భగవన్నామగానములో అచ్చట సమావేశమై యున్నవారందరుచేరి తాళములు వేసిరి. నేను యేమతమునకు జెందినదానను కాకపోవుటచే అనేక మతములవారి ప్రార్థనలకు వెళ్లియుంటిని. కాని యింత సంతోషంగా యితరచింత లేమియు లేకుండా ప్రార్థనలుచేసిన వారి నిదివర కెచ్చటను నేను చూచియుండలేదు. ఆ సభలో మహాత్మ్మదీయుల ప్రార్థనాగీతములను, జొరాస్ట్రియను మతస్థుల ప్రార్థనా గీతములను పాడుట నా కాశ్చర్యము కలిగించెను. వారమునకు కొన్నిసార్లు క్రైస్తవప్రార్థన గీతములనుగూడ పాడెదరని నాతో చెప్పిరి. అందరువిశాలాకాశం క్రిందసమావేశమయ్యెదరు. ఒక దేవాలయములోగాని మసీదులోగాని, చర్చిలోగాని కూర్చుండి వారు ప్రార్థనలు చేయరు. ఈకారణముచేత ఎవ్వరు ఆక్షేపింప వీలులేదు. అన్ని మతములవారు ఈ ప్రార్థనలలో పాల్గొనవచ్చును.

మరుసటి ఉదయము నేను పనిచేయుచుండగా గాంధిమహాత్ముడు నావద్దకువచ్చి 'మీరు సుఖముగా నున్నారా?' అని ప్రశ్నించెను. 'అనేక వందనములు, ఇచటికి వచ్చినది మొదలు నేను చాలా సుఖముగా నున్నాను' అని నేను సమాధానమొసంగితిని. గాంధిమహాత్ముడు నూలువడుకుట నాకు కొంత మేలుకలుగజేసెను. నిరుపమానమైన ఓర్పుతో కూర్చుని ఆయన నూలువడుకును. దారము తెగినప్పుడు, రాట్నము చెడిపోయినప్పుడు ఆయన విసుగు జెందరు. మౌనంగా ఆయన నూలు వడుకుచుండును. ఎన్ని సంవత్సరముల నుండి ఆయన ఈ విధముగా నూలువడుకుచుండెను? 30 సంవత్సరములనుండియా, 40 సంవత్సరములనుండియా? ఆయుధములకంటె, మందుగుండుకంటె రాట్నచక్రము బలవత్తరమైనదని ఆయన యెప్పుడు గ్రహించెను? వడకడం ఆయన యెప్పుడు ప్రారంభించెను? ఇంకా యెంతకాలము ఆయన వడుకును? తన యభీష్టము నెరవేరువరకా?

ఒకేవక వ్యక్తి, బీదవాడు, నిరాడంబరుడు, నిష్కపటి యైనప్పటికి మృదుస్వభావము, దయ, ప్రేమస్వరూపుడను వ్యక్తి క్రమముతప్పని ఆదర్శప్రాయ జీవితము వల్ల యింతపని సాధించెనను విషయము ఆశ్చర్యముకలిగింపక మానదు. 'ఆయన మమ్ములను ఒక జాతిగా చేసెను.' అనిషియామతస్థుడొకడు చెప్పెను.

మధ్యాహ్నసమయమున ఆయన కట్టిచిప్పలో భోజనము చేయుచుండగా, ఆతని ముఖచంచలనమును నేను గమనించితిని. ప్రతిరోజు ఆయన భోజన మేమరదురా! గోధుమజావ, ఫలహారమునకు సారింజపండు. రెండవసారి భోజనంగూడ చాలాలఘువైనది. ఇట్టి ఆహారము గైకొని ఆయనఉదయము 4-30 కి లేచి రాత్రి 8 గంటలకు నిద్రబోవును. రోజంతయు ఆయన తీరికలేకుండ పనిచేయుచునే యుండును. సభలకు హాజరగుచుండును, తన్ను చూడవచ్చిన పెద్దలతో మాటలాడుచుండును. తాను చెప్పి యితరులచే ఉత్తరములు వ్రాయించుచుండును. తాను చదువుచుండును. ఇతరులు చదువుచుండగావినును, మధ్యాహ్నము స్వల్పకాలము విశ్రమించు సమయమునగూడ ఆయన వళ్లుపట్టుచునే యుందురు; అందరి సమక్షమున ఆయన కాళిగోళ్లతీసి వేయుచుండురు; నిజముగా ఆతడు యోగిపుంగవుడై యుండవలెను. నేను యింత కష్టపడి పనిచేయవలసిన యెడల మూడు వారములలో ఈ స్మశాన చితిజ్వాలయములో నుందును. ఇంత పెద్దతనంలో ఆయన యింత శ్రమ చేయుచున్నాడు. ఆయనది ఉక్కు శరీరమై యుండవలెను. 125 సంవత్సరముల వరకు ఆయన జీవించ గోరుటలో ఆశ్చర్యమేమియులేదు.

ఆ సాయంకాలము వాహ్యాళినుండి తిరిగి వచ్చుసమయమున మహాత్ముడు నా కుటీరముప్రక్కగా వెళ్లుట తటస్థించెను, అచ్చట ఆడుకొనుచున్న నా ముద్దుల శిశువను నేనుచూచి ఆయన ఆనంద కందళిత హృదయారవిందు డయ్యెను.

'నీ శిశువు యెంతో అందమైనది. దాని ప్రతిమను నీవు తయారుచేయవలెను. గాని నాప్రతిమను గాదు' అని ఆయన అనెను.

'7 వారముల శిశువై యుండగా నేను దాని ప్రతిమను తయారుచేసితిని.'

'నీకెంత మంది పిల్లలు? ముగ్గురు. పెద్దదాని వయస్సు 9. రెండవ దాని వయస్సు 5. మూడవది యిది. మూడేండ్ల ప్రాయముకలది.

'ఇంత అందమైన శిశువులు నీకున్నప్పుడు ప్రతిమలను నీవెందుకు రచించెదవు. వారు జీవముగల విగ్రహములు. ఇచ్చటివారు నీవు మట్టితో తమ దేహములను పరిశుభ్రము చేసికొనుటకుగాను ఆ మట్టిని వారితో పాలుపంచుకొనుట మేలు' అని మహాత్ముడనెను.

దానికి నేను ప్రత్యుత్తర మాలోచించు లోపల ఆయన నవకే సాగించెను. 'మీకు గూడ పిల్లలున్నారుగదా! మీరెందుకు వదిలెదరు' అని నేను ఆయనను అడగగోరియుండెడిదానను.

తరువాత విగ్రహముయొక్క ఊర్ధ్వకాయమును రచించుటలో నేను నెన్నలయందు చాలాకాలము పనిచేసితిని. నాజ్ఞాపకమునుబట్టి నేను దానిని రచించితిని. మరుసటి ఉదయము వారి తల పూర్తిచేసి తక్కిన భాగముతో కలిపి విగ్రహమును పూర్తిచేయగలనని తలచుటచే యిట్లుచేసితిని, కాని విధి అన్యథాతలచెను. మేమున్న ఆవరణలో యిద్దరికి గవదబిళ్లలు లేచెనని మరుసటి ఉదయము నాకచ్చటివారు తెలిపి, శిశువుకు ఆ వ్యాధిసోకకుండుటకుగాను వెళ్లిపోవుట మంచిదనిరి. ఈకారణముచేత నన్ను తిరిగి మగన్వాడీకి తీసికొనిపోవుటాంగా వచ్చువరకు పనిచేసి తలను, ఊర్ధ్వకాయము పూర్తిచేయ నిశ్చయించితిని. మగన్వాడీలో దానిని పోతపోయవచ్చునని తలచితిని. అనిసంగానే నేను మహాత్మునివద్ద సెలవుగైకొనుటకు వెళ్లితిని. కిటికీబయలో తానచ్చటనుండువెడల తన సంపూర్ణవిగ్రహమును తయారుచేయుటకు నే ... చెప్పి ... మహాత్ముడు కొన్ని నియమములు పెట్టుకొనియున్నాడు. ఈ నియమములను ఆయన పట్టుదలతో, దృఢ సంకల్పముతో కొనసాగించును. నేనచ్చటున్న స్వల్పకాలములో ఆయన కోపగించుకొన్నట్లెప్పుడు కనబడలేదు. రోజంతయు ఆయన తీరికలేకుండా పనిచేయుచున్నప్పటికి ఆయన మృదుస్వభావము, సాధుస్వభావముగలవాడై యుండెను. భారతీయులందరు ఆయనను గౌరవించుటకు; ప్రేమించుటకు కారణము కొంతవరకు ఆయన అకృత్రిమ స్వభావము, నిరాడంబరత్వము, అహింసావ్రతదీక్ష అని తలతును. కొన్ని సమయములయందు, ఆయన బాహ్యకార్యకలాపములలో నిమగ్నుడు కాని సమయములలో అరుదుగా ఆయన ముఖము అత్యంత చింతాక్రాంతమైనట్లు నాకు కనబడెను. ఈ కారణముచేతే అకస్మాత్తుగా ఆయన నవ్వుట ఆశ్చర్యము కలుగజేయును.

గాంధిమహాత్ముని విషయమై యంతతెలిసినదాన నగుటచే, ఆతని ముఖలక్షణములను కపాలమును శాస్త్రజ్ఞుల నమ్మకములతో పోల్చిచూచుట మనోహరముగానుండును. పూర్వకాలమున ఐరోపాఖండమునందల్లి గుహలలో అనాగరిక జాతివారు నివసించుచుండిరి. వారికి జ్ఞానము బహుస్వల్పముగా నుండెను. ఈజాతి మానవులను మహాత్ముడు పోలియుండును. ముందుకు పొడుచుకొని వచ్చుదవడలుమాంసభక్షణగావించుజంతువుల లక్షణములుగా తలంపబడుచున్నవి. కాని మహాత్ముడు నైష్ఠికుడగు శాకాహారి. నిక్కబొడుచుకొనియున్న చెవులు జడుని లక్షణములుగాను మతిభ్రష్టు నిలక్షణములుగాను భావింపబడుచున్నవి. ఈ లక్షణములు మహాత్మునియందున్నవని యెవ్వరైనను చెప్పగలరా? మహాత్మునిముక్కు యూదుజాతివారిముక్కును బోలియుండును. అన్యాయంగా ద్రవ్యసముపార్జన చేయువారికి యిట్టి ముక్కులుండునని తలపబడుచున్నది. మహాత్ముడట్టిలక్షణములు కలవాడుకాడు. ముందు పొడుచుకొనివచ్చు మందమైన పెదవులు విషయాసక్తతను, కామమును సూచించునవిగా భావింపబడుచున్నవి. కాని మహాత్మునియందు విషయవైరస్యము ప్రస్ఫుటముగా నున్నది. మహాత్ముడు మహర్షితుల్యుడని, యోగిపుంగవుడని ప్రసిద్ధిగాంచియున్నాడు. దీనివల్ల నేమి బుజువగుచున్నది? మానవుల ముఖలక్షణములను గూర్చియు; పుర్రెల నిర్మాణములగూర్చియు మాయలమారిమాట లనేకము వ్రాయబడినవని నిస్సంశయముగా బుజువగుచున్నది. శక్తి పశ్చిమోత్తిభావములమూలమున తాము తక్కువవారని భావించుచున్న ప్రాచ్యఖండవాసులకు యిది ప్రోత్సాహకరముగా నుండును. మహాత్ముని నిష్కళంక శీలము ఆయన కండ్లలో ఉజ్వలముగా ప్రకాశించుచున్నది. ఆయనను చూచినవారెవ్వరు ఈ విషయమును కాదనజాలరు!

"ప్రస్తుత సమయమున క్రైస్తవ మతసిద్ధాంతములను ఆచరణయందు దురచుచున్న మహాశయుడు, ప్రఖ్యాత పురుషుడు క్రైస్తవుడు కాంట్టియు, హిందువు డైనట్టియు గాంధి మహాత్ముడొక్కడు మాత్రమే. జనసామాన్యములో నైతికము ఈయన పలుకుబడి అపరిమితము" అని సుప్రసిద్ధ బ్రిటిషు గ్రంథకారుడు ఎథెల్ మానిన్ 'జెడ్ అండ్ రోసస్' అను గ్రంథములో వ్రాసినవాక్యముల నుల్లేఖించుచు ఈ వ్యాసమును పరిసమాప్తము గావించుచున్నాను. జయహింద్.



ఒకరు చేయవి యొనరించిన, వరవర యత్నియము వన మనుమున రగు, దా నాడులకు నవి సేయకుండిక, పరాయణము పరమధర్మపథములందెల్లన్ (మహాభారతము)

1946-వ సం॥ జూలైనెల 7-వ తేది ఆదివారము

# యూరోపియనుల నిర్ణయం

బెంగాలు అసెంబ్లీ యూరోపియనుపక్షము ఈ దేశ రాజకీయ వ్యవస్థలో తన నిజస్థితిని ఇప్పటికి తెలిసికొనగలిగినది. రాజ్యాంగ పరిషత్తు ఎన్నికలలో తమ ఓట్లను వినియోగించమని ప్రకటించిరి. అస్సాము అసెంబ్లీ యూరోపియను పక్షముకూడ వీరిని అనుసరించెదరు గాక.

తమ నిర్ణయమునకు వారు తెలిపిన సంజాయిషీ, ధోరణి వారి సంప్రదాయము ననుసరించే యున్నది.

"బెంగాలు అసెంబ్లీ యూరోపియను పక్ష ఓటింగువిషయమున దేశములోని రెండు ప్రధానపక్షములు ఏ ఒడంబడికకు రానందు వల్లనూ, మా ఓట్లు విభేదములకు కారణమయ్యే సూచనలు కనుపడుటచేతనూ," రాజ్యాంగ పరిషత్తు ఎన్నికలలో ఓటుచేయకుండుటకు నిర్ణయించితి మనుచున్నారు.

అంతేకాని, అమాత్యత్రయ పథక సిద్ధాంతములు తమకు ఓటును నిషేధించుచున్నవని గ్రహించలేదు. యూరోపియనుసంఘ అధ్యక్షుడు సి. పి. లాసన్‌గారి ప్రకటన కారణముగా హరిజనులో గాంధిజీ తీక్ష్ణ విమర్శచేసెను.

పాలితవర్గమునకు చెందినవారగు బెంగాలు యూరపియనులు అసెంబ్లీలో తమకు అన్యాయముగా ప్రసాదింపబడిన ఓట్లమూలమున తమకు తాబేదారులుగా ఉండే కొంతమంది సభ్యులను ఎన్నుకొని తెరవెనుకనుండి నాటకమాడించ పూనుకొనిరి. శ్రీ లాసన్‌గారి ప్రకటనకు వేరే అర్థము లేదు.

గాంధిజీ వారి వ్యూహమును పసిగట్టి అతి కఠినముగ విమర్శచేసెను. "అధికారమత్తులో పడిపోయి 16 మే ప్రకటన తమకు న్యాయముగా, రాజ్యాంగపరిషత్తుఎన్నికకు నిలబడుటకుగాని, ఓటుచేయుటకుగాని, అధికారము నిచ్చుచున్నదో లేదో తెలిసికొనడానికి ప్రయత్నించలేదు." అని వ్రాసియుండెను.

అంతేకాక, యూరోపియను ఆధిపత్యమును గర్హించుచూ "ఈ బాధ" ఎన్నాళ్లు అని అడిగెను. గాంధిజీ విమర్శ సమస్తభారత ప్రజావైఖరిని ప్రస్ఫుటింప జేసినది.

ఆయన విమర్శకూడ వారివైఖరిలో విశేషమార్పును కలిగించినట్లు లేదు.

అఖరిగడియదాకా ఏదోవిధముగ పన్నుగడలను పన్నినట్లే యున్నది.

కాంగ్రెసేతర సాధారణ స్థానములకు ముస్లిమేతరస్థానములకు, ఈ రెండుపక్షములు అంగీకరించిన కొంతమంది అభ్యర్థులకు తాము ఓటుచేయుదుమని బెంగాలు అసెంబ్లీ యూరోపియను పక్షమువారు స్థానిక కాంగ్రెసు, లీగు నాయకులను అడిగిరట.

లీగునాయకులు ఏమి సమాధానము చెప్పిరో తెలియ జేయబడలేదు. కాని యూరోపియనుల ఓటింగు అధికార నిరోధమునకు జిన్నాగారు విముఖులని ఇదివరకు వెల్లడి అయినవిషయమే.

అయితే కాంగ్రెసువారు తగినసమాధానమిచ్చిరి. ఇరుపక్షములకు (లీగుకు, కాంగ్రెసుకు) అంగీకారమైన ప్రతినిధుల పట్టిక కుదుట దుస్సాధ్యమని చెప్పి, అసలు "భారతరాజ్యాంగ నిర్మాణ పరిషత్తులో యూరోపియనులకు ప్రసేయము ఉండకూడదు." అని కూడ చెప్పిరి.

భారత రాజ్యాంగ నిర్మాణబాధ్యత భారతీయులదే అన్న అజ్లీగారి ప్రవచనమునుబట్టి ఆ వ్యవహారములో విదేశీయులైన యూరోపియనులకు ఎట్టిస్థానము ఉన్నలేదు.

వారు పెద్దసంఘమూ కాదు; మైనారిటీ కాదు.

యూరోపియను ఓటువిరమణవల్ల కాంగ్రెసు కార్యవర్గము యొక్క, బ్రిటీషుపక్ష దీర్ఘకాల ప్రతిపాదనల ఆమోద నిర్ణయమునకు బలమేర్పడుచున్నది.

రాజ్యాంగపరిషత్తు సర్వస్వతంత్రమై యుండవలెనను మే 24 వ తేదీ కార్యవర్గ తీర్మానములోని సూచనను, ఆ మరునాడు మంత్రిత్రయము, రాజప్రతినిధి ఇచ్చిన సమాధానమును, బెంగాలు అసెంబ్లీ యూరోపియనుపక్ష నిర్ణయము కొంతవరకు సవ్యమార్గమున పెట్టుచున్నది.

అల్పసంఖ్యాకుల కవసరమైన ఏర్పాటుచేయుటలోనూ, అధికారమును వశముచేయుటవల్ల వచ్చేజంజాటములను గురించి ఒడంబడికచేసికొనే విషయములోనూ తప్ప రాజ్యాంగ పరిషత్తు వ్యవహార విచక్షణలకు నిరోధము లేదని అమాత్యత్రయప్రకటనవల్ల తేలినది. "రాజ్యాధికారమును భారతీయులవశము చేయుటకు, అవసరమైన చర్య తీసికొనవలసినదిగా పార్లమెంటుకు సామ్రాజ్య ప్రభుత్వము సిఫారసు చేయును." అని కూడా వారిప్రకటన తెలిపినది.

పథకమును కాంగ్రెసు యథాతథముగ అంగీకరింపబోవుటలేదు. దాని స్వరూపమును దిద్దగలనను కృతనిశ్చయముతోనే, మార్పగలనను దృఢవిశ్వాసముతోనే ఆమోదించినది.

అంతేకాక, కేంద్రమున బాధ్యతాయుతమైన ప్రభుత్వమున్నపుడే స్వతంత్రవాతావరణ మేర్పడి, పరిషత్తు సవ్యముగ సాగుట సాధ్యమని జూన్ 26 న కార్యవర్గతీర్మానము తెలుపుచున్నది.

కాబట్టి తాత్కాలిక ప్రభుత్వ స్థాపననుబట్టి దాని స్వరూపమునుబట్టి పరిషత్తు ఎడ కాంగ్రెసువైఖరి యుండగలదు.

ఆ తాత్కాలిక ప్రభుత్వమెటులుండవలెనో కార్యవర్గ మీవిధముగ వర్ణించినది. "తాత్కాలిక ప్రభుత్వమునకు బాధ్యత, అధికారము ఉండవలెను. చట్టరీత్యా గాకపోయినా ఆచరణలో సంపూర్ణాధికారముండి భారతస్వాతంత్ర్యానికి వారితీసెడిదిగా నుండవలెను. ఆ ప్రభుత్వసభ్యులు స్వప్రజకుతప్ప, పరాయి అధికారమునకు దేనికి బాధ్యులుగా నుండజాలరు."

# భారతదేశ పారిశ్రామికపద్ధతి

దేశములో పరిశ్రమలను కట్టుదిట్టముగ చేస్తే జీవితప్రమాణము పెరుగుతుందనే అందరికి తెలిసిన విషయమే. లభ్యము అయ్యే పదార్థాలూ వాటిని ఉపయోగించుకొనే అవకాశాలూ అందుకు మానవులు ఉపయోగపడటమూ, తయారయిన వస్తువులు సక్రమముగా సరఫరా కావడమూ ఇందుకు లక్ష్యాలుగా ఉండవలెను.

భవిష్యత్తులో ఏర్పడబోయే జాతీయ ప్రభుత్వానికి ఒక కేంద్రమున్నా ఆ కేంద్రములో ఎటువంటి సంబంధముకలవైనప్పటికిన్నీ రాష్ట్రీయులున్నా ఉంటవి. ఆయా రాష్ట్రాలున్నా కేంద్రమున్నా పయిలక్ష్యలతో పరస్పర సహాకారముతో పనిచేయవలెను.

## గృహపరిశ్రమలు

ఆయా రాష్ట్రాలలో ఈ నాడు సాగుతూ ఉన్న పరిశ్రమలను గురించి సర్వే చేయవలెను. అనేక రాష్ట్రాలలో విరివిగా వ్యాప్తము అయి ఉన్న చిన్నచిన్న పరిశ్రమలను సర్వేచేయడానికి ఒక ప్రత్యేక అధికారిని నియమించవచ్చును. లేదా ఒక కమిటీని నియమించవచ్చును. ఆయా పరిశ్రమలు ఉన్న రాష్ట్రాలవారు ఈ పనిని జాయంటుగా చేయవచ్చును. లేదా ఆయా రాష్ట్రాలకుగాను కేంద్రప్రభుత్వమువారు ఈ పనిని చేయవచ్చును. లక్కీన చిన్నపరిశ్రమల విషయము సర్వేచేయడానికి ఒక్కొక్కదానికి ఒక్కొక్క ప్రత్యేక అధికారిని నియమించవచ్చును. ఒకే అధికారి అనేక పరిశ్రమలను సర్వేచేయవచ్చును కూడాను. ఈసర్వే సమగ్రముగా సత్వరముగా జరగడమే ముఖ్యావసరము.

ఆయాపరిశ్రమలకు కావలసిన ముడిపదార్థాలూ వాటిసరలూ వాటిని ఏవిధముగా తయారుచేయడానికి వీలుఅయ్యేదీ అనగా యంత్రాలతోనే ఆపరిశ్రమలు సాధ్యమవుతవా వాటి అవసరము లేకుండానే తయారు చేయవచ్చునా అందుకు అవసరమయిన పనితనము, ఆయావస్తువుల రవాణా సౌకర్యాలు, అందుకు అయ్యేఖర్చులు, ఆపారిశ్రామిక వస్తువులమీద వచ్చే రాబడి మొదలయిన యావద్విషయాలున్నూ సర్వేవల్ల తేలవలెను. ఇప్పుడు ఆపరిశ్రమలో ఎంతమంది మనుష్యులు, యిప్పుడు పనిచేస్తూ ఉందీ,యికముందు ఎంతమంది మనుష్యులు పని చేయడానికి అవకాశము ఉండేది

[ప్రొఫెసర్ సి. యన్. వకిల్]

తెలుసుకోవలెను. అదే భారీ ఎత్తున పరిశ్రమ సాగించేట్లయితే ఆర్థికముగా ఆ పారిశ్రామిక ప్రాంతాలకు కలిగే యిబ్బందులు మొదలయినవన్నీ యోజించవలెను. ఆయాపారిశ్రామిక వస్తువులు భారతదేశములో కానీ విదేశాలలోకానీ భారీ యెత్తున తయారు వాటి పోటీకి నిలవగలవో లేవో చూడవలెను. అవసరమని తోచేట్లయితే ఆయా పరిశ్రమలకు సంరక్షణ సుంకములు విధించవలసిన విషయమున్నూ యోజించవలెను.

## రాష్ట్రీయ పారిశ్రామిక సంఘాలు

రాష్ట్రీయ పారిశ్రామిక సంఘయాజమాన్యముకింద సర్వే జరగవలెను. ఈసర్వే రెండువిధాలుగా ఉండవలెను. చిన్నచిన్న పరిశ్రమలనుగురించిన్నీ భారీయెత్తున సాగించవలసిన పరిశ్రమలను గురించి రెండుభాగాలుగా సర్వే చేయవలెను. ఆయాపరిశ్రమలు అతివేగముగా అభివృద్ధి అయ్యేమార్గాలు అన్వేషించవలెను.

చిన్నచిన్న పరిశ్రమలను అభివృద్ధి చేయడానికి ప్రజలతోనే కార్పరేషన్లను ఏర్పాటు చేయవచ్చును. కొన్ని నియమాలతో ఆ కార్పరేషన్లు జాయింటుస్టాకు కంపెనీలమాదిరిగా పనిచేయవలెను. వ్యాపారస్థులున్నూ, సాంకేతిక నిపుణులున్నూ ఆ కార్పరేషనులో చేరేటట్లు చేయవచ్చును. అయితే వారు లాభము పొందడానికి కాకుండా ఆయా కార్పరేషన్లకు తోడు పడేటందుకు చేర్పించవచ్చును. పెట్టుబడి ప్రజలే పెట్టవలెను. లాభాలను ప్రభుత్వము గ్యారంటీ చేయవలెను. అయితే ఆ లాభాలకు ఒక నియమము ఉండవలెను. నియమాన్ని మించి లాభాలు వచ్చేట్లయితే ఆ సొమ్మును ఆపరిశ్రమ అభివృద్ధికే వినియోగించవలెను. కార్మికులకు సుఖపదార్థాలనూ, పనిముట్లనూ కార్పరేషన్ యివ్వవలెను. అవసరమయితే యంత్రాలనూ ఆ యంత్రాలు నడపడానికి విద్యుచ్ఛక్తిని సరఫరా చెయించవలెను.

ఆవస్తువులు ఒక ప్రమాణములో తయారు అయ్యేట్లు వాటి నిర్ణయానికి ఏర్పాటు చేయవలెను. ప్రతి కార్మికునికిన్నీ న్యాయముగా ప్రతిఫలము ముట్టేటట్లు చూడవలెను.

ఆ కార్పరేషన్‌కు లిమిటెడ్యమయిన యితర రాష్ట్ర కార్పరేషనులతో సంబంధము ఉండవలెను. అవిధముగా ఉండేట్లయితే పరస్పర సహకారము సుసాధ్యమవుతుంది.

## భారీపరిశ్రమలు

భారీపరిశ్రమలు కేంద్రప్రభుత్వ స్వాధీనములో ఉండవలెను. ఏమంటే ఆయా భారీపరిశ్రమలకు సంబంధించిన పెద్దపెద్ద యంత్రసామగ్రులను తెప్పించడమూ ఆ పరిశ్రమ జయప్రదముగా దేశములో సాగేటందుకోసము దిగుమతి సుంకాలు విధించడము మొదలయిన పనులన్నీ కేంద్రప్రభుత్వముకే సాధ్యము అవుతవి. రాష్ట్రీయ ప్రభుత్వాలు ఆయా భారీపరిశ్రమలు స్థానికముగా అభివృద్ధి అయ్యే పనులనే చేయవలెను. కొన్ని సందర్భాలలో అనగా దేశరక్షణకు అవసరమయిన పరిశ్రమలను కేంద్రమున్నూ రాష్ట్రాలున్నూ విభాగించుకొని ఆయాపరిశ్రమలను వృద్ధిచేయవలసి ఉంటుంది.

## పారిశ్రామిక ప్లానింగ్ కమీషన్

ఇందుకు కేంద్రప్రభుత్వమువారు పారిశ్రామిక ప్లానింగ్ కమీషన్ నియమించవలెను. ఈ కమీషన్‌లో రాష్ట్రీయ పారిశ్రామికసంఘాల ప్రతినిధులు ఉండవలెను. నిరంతరాయముగా పారిశ్రామిక పనులు సాగించడానికి కావలసిన సిబ్బంది ఉండవలెను. ఇందుకు కేంద్రప్రభుత్వమువారి పారిశ్రామిక శాఖయున్నూ ఆయా రాష్ట్రాల పారిశ్రామిక శాఖలవారున్నూ బాధ్యత వహించవలెను.

కమీషన్‌లో అనేక శాఖలు ఉండవలెను. ఒక్కొక్క పరిశ్రమకు ఒక్కొక్క శాఖ పనిచేయవలెను. 1. చిన్నచిన్న పరిశ్రమలశాఖ, 2. ముడిపదార్థాలశాఖ, 3. విద్యుచ్ఛక్తిశాఖ, 4. యంత్రములశాఖ, 5. స్థలనిర్దేశశాఖ, 6. రవాణాశాఖ, 7. ప్రభుత్వ కంట్రోలుశాఖ, 8. ప్రభుత్వ సహాయశాఖ, 9. కార్మికశాఖ, 10. విక్రయశాఖ ఇవి అవసరము.

ప్రతిశాఖాధ్యక్షుడున్నూ పారిశ్రామిక ప్లానింగ్ కమీషన్‌లో సభ్యుడుగా ఉండవలెను. ఆయాశాఖలు ఆయారాష్ట్రాలతో పరస్పరసహాయములో పనిచేయవలెను. ఈ శాఖలన్నీ ఏకకాలమందు పనిచేసేట్లయితే పారిశ్రామిక ప్లానింగుద్వారా దేశానికిన్నీ సుకరముగా చేయవచ్చును. ఒకనిర్ణీతపరిశ్రమకు కమీషను ఒక కమిటీ నియమించవచ్చును.

ఈపారిశ్రామిక సమస్యను అన్నివైపుల నుంచి పరిష్కారము కావలెను. అట్లా చేయగలిగితేనే సాధ్యమయినంత త్వరలో గమ్యాన్ని చేరగలుగుతాము. ఇప్పుడు భిన్నాభిన్నములుగా ఉన్న పారిశ్రామిక సంస్థలవిషయాల నన్నిటినిగురించి తెలుసుకొని వాటిని పునరుద్ధరించవలెను. ఇది జరగవలసిన కార్యక్రమము. కాపీరైట్

# రైల్వేబడ్జెటు పద్ధతి మార్పు జరగవచ్చును

## ఆర్థిక స్థాయిసంఘ సమావేశంలో చర్చ

(స్వకీయ విలేఖరి)

న్యూఢిల్లీ, జూలై 6: జూలై 17, 18 తారీఖుల్లో, రైల్వేల ఆర్థిక స్థాయిసంఘమిక్కడ సమావేశం కానున్నది; రైల్వే బడ్జెటు తయారుచేయడానికి ఒక కొత్త పద్ధతి ఏర్పరచడం విషయమై, ఈ సమావేశంలో చర్చ జరుగుతుంది. ఫైనాన్సు కమీషనరు ఐ. ఎస్. పూరీగారు సమావేశానికి అధ్యక్షత వహిస్తారు. ఈ కొత్త ప్రతిపాదన అమలు జరిగితే భారత ప్రభుత్వంవారికి రైల్వే నిధానామీద ఇప్పటికంటె ఎక్కువ అధికారం ఉంటుంది; అయితే రైల్వే జనరల్ మానేజరుకూడా ఖర్చుపెట్టడానికి ఇప్పటికంటే స్వేచ్ఛ ఎక్కువవుంటుంది. 1947 నుంచి రైల్వేలమీద పెట్టవలసిన పెట్టుబడి కార్యక్రమాన్ని కూడా ఈసమావేశంలోనే చర్చిస్తారు.

# చరిత్రాత్మక సమావేశం

1 వ పేజీ తరువాయి

కాంగ్రెస్‌కార్యవర్గం రేపు ఏ.ఐ.సి.సి. సభలో ప్రతిపాదించబోతున్న ఏకపంక్తి తీర్మానపాఠం ఏమిటంటే: "కాంగ్రెస్ కార్యవర్గం ఢిల్లీలో జూన్ 26 వ తేదీన చేసిన తీర్మానం వున్నదాన్ని వున్నట్టుగా ఇక్కడ ఆమోదిస్తున్నాము." లోతుకుపోయిచూస్తే ఈ తీర్మానంలో చాలా అర్థం వున్నది. వివాదగ్రస్తమైన అంశాలుగాని, అనవసరపు సవరణలుగాని ఏమీ లేకుండా చూడడానికే కాంగ్రెస్ కార్యవర్గం ఈ పద్ధతి అనుసరించింది. జూన్ 26 వ తేదీన తాముచేసిన తీర్మానపాఠంలో మార్పుగాని, సవరణగాని ఉండకూడదన్నదే కాంగ్రెస్ హైకమాండ్ ఆదుర్దా. ప్రస్తుత పరిస్థితులలో ఏవైనా సవరణలను ప్రతిపాదించినట్లయితే ఉత్తరోత్తరా తాత్కాలిక కేంద్రప్రభుత్వ విషయమై బ్రిటిషు ప్రభుత్వ ప్రతినిధులతో జరుపవలసిన రాయబారాలలో చిక్కులు ఏర్పడవచ్చునని కాంగ్రెస్ పెద్దల అభిప్రాయం.

మూడుసెలల రాయబారాలలో జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలను, కాంగ్రెస్ కార్యవర్గ తీర్మానాలను పొందుపరుస్తు కాంగ్రెస్ సెక్రెటేరియట్ ఒక "వైట్‌పేపర్"ను ప్రచురించింది. దీని ప్రతులను ఏ. ఐ. సి. సి. సభ్యులందరికి కాంగ్రెస్ కార్యాలయం అందజేస్తున్నది. కాంగ్రెసు కార్యవర్గం ఏ పరిస్థితులలో ఏ చర్యలు ఎందుకు తీసుకోవలసి వచ్చిందీ, ఏ తీర్మానాలను ఎందుకు చేయవలసి వచ్చిందీ ఈ 'వైట్‌పేపర్' ఏ. ఐ. సి. సి. సభ్యులకు బాగా వ్యక్తపరుస్తుంది. ఇందువల్లనే కాంగ్రెసు కార్యవర్గము ఏ. ఐ. సి. సి. లో ఏకపంక్తి తీర్మానాన్ని ప్రతిపాదించడానికే నిశ్చయించింది. దీర్ఘకాల ప్రతిపాదనను ఆమోదించడం, తాత్కాలిక కేంద్రప్రభుత్వ నిర్మాణ సూచనను నిరాకరించడము; ఇదే ఈ తీర్మానములోని ముఖ్యాంశం. ఏ. ఐ. సి. సి. సభ్యులు ఈ తీర్మానాన్ని ఒప్పుకుంటే ఒప్పుకుంటున్నామనో, లేకపోతే ఒప్పుకోవడం లేదనో ఒక ముక్కలో తేల్చి వేయవలసి వుంటుంది. కాంగ్రెసు హైకమాండ్ యుక్తియుక్తంగానే ఈ ఎత్తువేసిందని చెప్పవలసి వుంటుంది. అనవసరపు సవరణలకు ఇందులో ఏ విధమైన అవకాశమూ లేదు. ప్రతినిధులు కాంగ్రెసు హైకమాండు ప్రతిపాదించే తీర్మానాన్ని పూర్తిగా ఒప్పుకోవైనా ఒప్పుకోవాలి; లేదా, పూర్తిగ తోసివేయవైనా తోసివేయాలి.

ఆ మాత్యత్రయంతో జరిపిన రాయబారాలలో కాంగ్రెస్ తరఫున సూత్రధారిగా పనిచేసిన మౌలానా ఆజాద్ ఏ. ఐ. సి. సి. లో కాంగ్రెస్ కార్యవర్గం సూచించిన ఏకపంక్తి తీర్మానాన్ని ప్రతిపాదిస్తాడు. ఢిల్లీ రాయబారాలలో, సమాలోచనలలో ప్రధాన భూమికను నిర్వహించిన సర్దార్ వల్లభాయ్ పటేల్ దీన్ని బలపరుస్తాడు. డాక్టర్ పట్టాభి సీతారామయ్య, శంకరరావుదేవ్, గోవింద వల్లభపంత్, సి. రాజగోపాలాచారి మొదలైన పెద్దలు ఈ తీర్మానానికి తగిన మద్దతుగా ప్రసంగిస్తారు.

## అధ్యక్ష విరమణ

ఆరు సంవత్సరాలపాటు కాంగ్రెస్ మహాసంస్థ అపూర్వమైన ప్రతిభతో, ప్రజ్ఞతో నాయకత్వంవహించిన మౌలానా అబుల్‌కలామ్ ఆజాద్ ఏ.ఐ.సి.సి.సభలో తీర్మానాన్ని ప్రతిపాదించి, తొలిప్రసంగాన్ని చేసినతర్వాత, అధ్యక్షస్థానాన్ని ఖాళీచేసి, పండిట్ నెహ్రూకు అప్పగిస్తాడు.

## వామపక్ష వైఖరి

బ్రిటిషు మంత్రిత్రయం ప్రతిపాదించిన రాజ్యాంగ ప్రజాపరిషత్తు నిర్మాణ పథకాన్ని తీవ్రధోరణిలో ప్రతిఘటించడానికి కాంగ్రెసు సోషలిస్టులు నాయకత్వంకింద వామపక్షంవారు తమ బలాన్ని సమీకరించుకుంటున్నారు. ఐనప్పటికీ కాంగ్రెసు హైకమాండు తీర్మానాన్ని అధిక సంఖ్యాకులు ఆమోదిస్తారనే లాబీ వర్గాల వారు అభిప్రాయ పడుతున్నారు.

పండిట్ నెహ్రూ అధ్యక్షస్థానాన్ని అలంకరించడానికి కూడా కాంగ్రెసు కార్యవర్గం ఈనాడు ఆమోదించింది. ఇప్పటికి ఆరు సంవత్సరాలకు పైగా ఈ గురుతరమైన కార్యభారాన్ని మౌలానా ఆజాద్ నిర్వహించాడు.

ఏ. ఐ. సి. సి. సమావేశం ఇక్కడి కౌవాస్జీ జహంగీర్ హాలులో 6-వ తేదీ అపరాహ్ణం 2 గంటలకు ప్రారంభమవుతుంది. సమావేశం పూర్తి అయేసరికి నాలుగురోజులు పడుతుంది.

## సిక్కునాయకుని విపరణ

ఈరోజు జరిగిన కాంగ్రెసు కార్యవర్గ సమావేశంలో సిక్కునాయకుడు కన్నల్ నిరంజన్‌సింగ్ దాదాపు 1½ గం. సేపు ప్రసంగించాడు. సిక్కులు కాంగ్రెసు వైఖరిని పూర్తిగా బలపరుస్తారనీ, కాంగ్రెసు ఏ నిర్ణయాన్ని చేసినప్పటికీ కట్టుబడివుంటారనీ ఆయన కార్యవర్గ సభ్యులకు హామీ ఇచ్చాడు. పంజాబు రాష్ట్రంలో సిక్కులు ప్రధానమైన మైనారిటీగా ఉన్నారు కాబట్టి వారికి యథోచిత స్థానం లభ్యమయేట్లు చేయవలసిందని కాంగ్రెసు కార్యవర్గాన్ని ఆయన కోరాడు.

భారత రాజ్యాంగ పరిషత్తు ఎన్నికలలో బెంగాల్, అస్సాం యూరోపియనులు ఓటింగు అధికారాన్ని వినియోగించుకోరనే విషయంలో కాంగ్రెసు చేయవలసిందేమిటనే అంశాన్ని గురించికూడా కార్యవర్గం ఆలోచించింది. బెంగాలు యూరోపియనులు చేసిన నిర్ణయం కాంగ్రెసు పెద్దలకు అప్పటికి ఇంకా అందలేదు.

## రామచంద్ర కాక్

కాశ్మీర ప్రధాని రాయబహాదుర్ రామచంద్ర కాక్ ఈ రోజు సర్దార్ వల్లభాయ్ పటేలును కలుసుకొని కాశ్మీరపరిస్థితిపై చాలాసేపు సంప్రదించాడు. రామచంద్ర కాక్‌గారు రేపు మౌలానా ఆజాద్‌తో కూడా ఇదే విషయమై సంప్రదిస్తారని తెలుస్తున్నది.

కాశ్మీర ప్రధాని ఇద్దరు ప్రముఖ కాంగ్రెసు నాయకులతో జరిపే సంభాషణల ఫలితంగా, నెహ్రూ కాశ్మీర సంస్థానంలో ప్రవేశించకూడదని అమలుపరచిన నిషేధాజ్ఞ రద్దు కావచ్చునని విమర్శకులు అభిప్రాయపడుతున్నారు.

కాశ్మీర సమస్యను సామరస్య పూర్వకంగా పరిష్కరించడానికి నరేంద్రమండలి అధ్యక్షుడు భోపాల్‌నవాబ్ కూడా తన పలుకుబడిని ఉపయోగిస్తున్నట్లు తెలుస్తున్నది.

## దక్షిణాఫ్రికా సమస్య

దక్షిణాఫ్రికా ప్రభుత్వం భారతీయులకు ప్రతిబంధకంగా చేసిన అక్రమశాసనాన్నీ, అక్కడ భారతీయులు సాగిస్తున్న సత్యాగ్రహాన్నీ గురించికూడా కాంగ్రెసు పెద్దలు నేడు చర్చించారు. కాంగ్రెసు కమిటీ ఈవిషయమై ఒక తీర్మానాన్ని చేసింది. ఇందులో తెల్లవారి దురంతాలను ఖండించారు. ఏ. ఐ. సి. సి. లో దీన్ని ప్రతిపాదిస్తారు.

## నెహ్రూ - జయప్రకాశ్ సంభాషణ

కాంగ్రెసు సోషలిస్టునాయకుడు జయప్రకాశ్ నారాయణ, పండిట్ నెహ్రూ ఈ రోజు కొంచెము సేపు గోష్ఠి జరిపారు. డా॥ రామమనోహర్ లోహియా, అచ్యుత పట్వర్ధనుగారలు గాంధీజీని రెండురోజుల క్రితమే కలుసుకున్నారు. రాజ్యాంగ పరిషత్తు పథకాన్ని గురించి వీరు మహాత్మునితో చర్చించారు. ఏ. ఐ. సి. సి. సభలో రైటిస్టులు, లెఫ్టిస్టులు ఏకాభిప్రాయంగా ఏ కాభిప్రాయానికి రావడానికి ఎంతవరకు వీలున్నదో చూడడానికి వీరు పరస్పర సమాలోచనల ద్వారా ప్రయత్నించినట్లు తెలుస్తున్నది.

వివిధ రాష్ట్రాల నుంచీ రాజ్యాంగ పరిషత్తు అభ్యర్థులుగా నిలుస్తున్న వారి జాబితాలను గురించి కాంగ్రెసు కార్యవర్గం ఈ రోజు చర్చించినట్లు కూడా తెలియ వస్తున్నది.

# ఆంధ్ర నాయకుల ఆగమనం

## నగరాంధ్రప్రముఖుల సన్మానం

['ఆంధ్రపత్రిక' ప్రతినిధి]

బొంబాయి, జూలయి 6: ఆంధ్ర కాంగ్రెసు నాయకుడు డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యపంతులుగారు ఈ ఉదయం ఇక్కడికి చేరారు. విక్టోరియా టర్మినస్ స్టేషనువద్ద వారికి బొంబాయి రాష్ట్రీ కాంగ్రెసు కార్యదర్శి శీలంగారు స్వాగతం ఇచ్చారు; చావలి నాగేశ్వరరావుగారి ఇంట్లో డా॥ పట్టాభిగారు బస చేస్తున్నారు.

ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంపంతులుగారు అపరాహ్ణం ఇక్కడికి చేరారు. మదరాసు రాష్ట్ర ప్రధానామాత్య పదవిని స్వీకరించిన తర్వాత ప్రకాశంగారు బొంబాయికి రావడం ఇదే మొదటిసారి. బొంబాయి నగరాంధ్రప్రముఖులు, రాష్ట్రీ కాంగ్రెసు ప్రముఖులు ప్రకాశంగారికి రైలుస్టేషనుకు వెళ్లి స్వాగతం ఇచ్చారు. స్థానిక ఆంధ్రమహాసభ అధ్యక్ష కార్యదర్శులు జేకే నరసింహారావుపంతులు, పి. తిరుమలరావుగారలు, కూడా ప్రకాశంగారికి సన్మానించారు.

ప్రకాశంగారి బస "ఇండ్రాక్ హౌసు"లో

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు ఆచార్య రంగా, ఏ. కాళేశ్వరరావు, వల్లూరి, గోపాలరెడ్డిగారలు కూడా ఈ రోజు ఇక్కడికి వచ్చారు. వీరు బొంబాయి రాష్ట్రీ కాంగ్రెసు కమిటీ అతిథులుగా వున్నారు.

కాంగ్రెసు కార్యవర్గం

కాంగ్రెసు కార్యవర్గ సమావేశం 7 వ తేదీ ఉదయం 9 గం. 30 కి జరుగుతుంది.

# ఇండొనీషియాలో ప్రజాస్వామ్యరక్షణకై 'నియంతృత్వం'

## డా॥ ఐ. ఆర్. సొకార్నో ప్రకటన

బటేవియా, జూలై 4: జావాలో ప్రస్తుత పరిపాలనా విధానము నియంతృత్వమే అయినా, అది ప్రజాస్వామ్య సంరక్షణకై ఏర్పడిన నియంతృత్వమని ఇండొనీషియా రిపబ్లిక అధ్యక్షుడు డా. ఐ. ఆర్. సొకార్నో అన్నాడు. అయినా దీనిని నియంతకొనసాగించే ఉద్దేశ్యం ఏకోశానలేదని సొకార్నో వక్కాణించాడు. అని ఇండొనీషియన్ వర్గాలద్వారా వార్త వచ్చింది.

మంత్రివర్గం యథాపూర్వంగా వ్యవహరించగలిగే టంతవరకు న్యాయశాఖ తాను సర్వసంపూర్ణాధికారాలుంచుకుంటానని సొకార్నో వివరించాడు. సొకార్నో మంత్రివర్గ సభ్యులను సలహాదారులుగా ఉంచుకుంటాడు. డా. సొకార్నో, జనరల్ మహమ్మద్‌హట్టా (కేంద్రకౌన్సిలు ఉపాధ్యక్షుడు) దేశరక్షణ మంత్రిగా పనిచేస్తూవచ్చిన అమీర్ షరిఫోడిన్, మిలిటరీ నాయకులు వీరితో కూడిన ఒక మిలిటరీ సలహా సంఘం కూడా ఉంటుంది. ఇటీవల జరిగిన ఇండొనీషియా ప్రధాని అపహరణ సందర్భంలో, ఇండొనీషియా సేనలలోని కొందరు ఉన్నతోద్యోగులున్నూ యెక్కువగా పేరుమోగని మరికొందరు రాజకీయవేత్తలునూ అరెస్టుచేయబడ్డారని, డచ్చివర్గాలు చెబుతున్నవి.

## రాజకీయ విరోధులకుట్ర

డా॥ షారీర్ యొక్క రాజకీయ విరోధులు, ఆతనిని పడగొట్టడానికే కాకుండా అధ్యక్షుడు సొకార్నోను కూడా పడగొట్టదలచినట్లు పన్నారనీ సొకార్నో స్థానే దస్యావారి చేతుల్లో తర్ఫీదు అయిన కమ్యూనిస్టు నాయకుడు టాన్ మలాక్కా స్థాపించ దలచారనీ, ఇండొనీషియా వార్తామంత్రి డా॥ మహమ్మద్ నాట్సిర్ నేటిరాత్రి ప్రకటించాడు.

ప్రథమ రిపబ్లిక్ మంత్రివర్గంలో విదేశాంగమంత్రిగా పనిచేసిన డా॥ సొబార్జో, ఆ మంత్రివర్గంలోనే రహదారీ మంత్రిగా పనిచేసిన డా॥ అబికోస్నోలు ఈ ప్రతికూల విప్లవానికి నాయకులు అని ఆతడు చెప్పినాడు. డా॥ సొబార్జో తన కుట్ర సఫలమైతే, ఇండొనీషియాను మిత్రరాజ్య వ్యవస్థ ధర్మకర్తృత్వానికి అప్పగించ దలచాడని సోదా చెయ్యగా దొరికిన కొన్ని డాక్యుమెంట్లు వల్ల తెలుస్తున్నది. ఈ కుట్ర అక్టోబరులోనే ప్రారంభమైందనీ, ఫిబ్రవరిలో చేసిన ఒక ప్రయత్నం విఫలమైందని నాట్సిర్ వెల్లడించాడు.

మిత్ర రాజ్య కార్యాలయం వారు బెకాసీనది తూర్పు ఒడ్డు ఆక్రమించవలదామని అధికారరీత్యా ఇండొనీషియన్లు హెచ్చరించారట; గుర్ఖాలు నది దాటారని కూడా ఒకవార్త వచ్చింది కాని, అధికారరీత్యా ఈ వార్త ఇంకా నిర్ధారణ కాలేదు.

# భారతీయులలో అంతః కలహంలేదు

## బ్రిటిషు రేడియో మాజీసంపాదకుని వ్యాసం

లండను, జూలై 6: బ్రిటిషు బ్రాడ్‌కాస్టింగు కార్పొరేషనులో యిదివరకు వార్తాసంపాదకుడుగా పనిచేసియుండిన హైనెల్ ఫీల్డెన్ గారు "న్యూస్టేట్సుమన్ అండ్ నేషన్" పత్రికలో యిలా వ్రాశారు.

ఇండియాలో అంతఃకలహము చేసేదేమీ లేదు. బ్రిటిషువారు పెత్తనం వహించి స్వరమెక్కినట్లుగా పైన కూర్చుండి సవారిచేస్తున్నారు. వారెక్కిన స్వరము నుంచి వారు దిగకపోవడం ఒక్కటే గాంధీ చెప్పినట్లుగా ఇండియాలో ఉన్న పెద్ద తగాదా. బ్రిటిషువారు తొలగిపోతే, గాంధీయున్నూ, జిన్నాయున్నూ ఏకమై ఒక్కమాటకు వస్తారు.

## కాంగ్రెసు అభినందనము

కలకత్తా, జూలై 6: బెంగాలు కాంగ్రెసు పార్లమెంటరి పార్టీనాయకుడు కిరణశంకర రాయ్‌గారు యూరపియనులు రాజ్యాంగ పరిషత్తుకు ఓటుచేయకుండా ఉండడానికి నిశ్చయించుకొన్నందుకు వారిని అభినందిస్తున్నారు.

# మదరాసు అసెంబ్లీ

## బడ్జటు సమావేశం

మదరాసు అసెంబ్లీ బడ్జటు సమావేశం తేదీలు యీ క్రింది విధముగ నిర్ణయించబడినవి:-

జూలయి 31 తేదీ బడ్జటు ప్రవేశపెట్టుట ఆగస్టు 2, 3. 5 తేదీలందు జనరలు చర్చ ఆగస్టు 13 నుండి 17 వరకు, 19, 20, 22, 23, 24 సెప్టెంబరు 2 నుండి 4 వరకు డిమాండ్లపై వోటింగు జరుగును.

మలబారు శాసనసభ్యుడు పట్టకమరాయగారి ఎన్నికపై కేసు విచారణకై ఎలక్షను విచారణకోర్టుగ జిల్లా జడ్జి ఎస్. డి. కృష్ణస్వామిగారు, కె. వెంకటరాజు, మహాదేవయ్యగార్లు అడ్వకేటులు నియమింపబడిరి.

ఎస్. ఎం. నాయుడుగారు కృష్ణాజిల్లా జడ్జిగా నియమింపబడిరి.

## క్లాసులో కబుర్లు

కందుకూరి వీరేశలింగము పంతులుగారు కళాశాలలో బకనీయ గ్రంథములను బోధించుటకో దనివినొందక, సంఘ సంస్కారణాదిలోక విషయములను గురించి ముచ్చటించుచుందువారు. ఇది సహింపక యొక సమయమున కళాశాలలో సహోపాధ్యాయుడు, దేశభాషాన్వయన పరిశీలకుడును, వావిలాల వాసుదేవశాస్త్రిగారు, వీరు బోధించు తరగతి యొద్దకువచ్చి "పంతులుగారూ! ఇంక ప్రసంగము వదలి పాఠమునకు దిగవలెను" అని పంతులను మందలించిరి. "ఇదంతయు పాఠమె! యని పంతులు నిర్లక్ష్యముగ బలికి, విద్యార్థుల వైపునకు దిరిగి "కళాశాలా విద్యార్థులు వట్టి బడిపిల్లకాయలు కారు? పుస్తకాంశములతో పాటు ప్రపంచజ్ఞానమును బోధించు విద్యయె విద్య" అని పలికి, యథాప్రకారముగ దన ప్రసంగధోరణిలో జొచ్చెను.

—రాయసం వెంకటశివుడు.

## నీరా రాధనం

పల్నాటి వీరచరిత్రమున నభివర్ణింపబడిన వీరవరులను నా దేశమున నిప్పటికిని కొలుచుచున్నారు, బ్రహ్మనాయడు విష్ణువనియు, విష్ణ్వంశసంభూతుడనియు వ్రాయుటయేగాక, యా సీమలో నాబాల ...

ఢిల్లీలో కాంగ్రెస్ కార్యవర్గం ఆఖరు సమావేశానంతరం గాంధీజీ బసలో నాయకుల ఇష్టాగోష్ఠి పండిట్ నెహ్రూ, గఫార్ ఖాన్‌లతో లూయిస్‌ఫిషర్, వి. కె. కృష్ణమీనన్‌గార్లు ముచ్చటిస్తున్నారు.

# పాశ్చాత్యదేశాల సంక్షోభ తీరవలెనంటే-?

# గాంధీజీయే ఏడుగడ- భారతదేశమే దివ్యజ్యోతి

—లాయిస్ ఫిషర్—

ప్రస్తుతపు సీమను పరిశీలితంగా అర్థం చేసుకోవడం భారతదేశానికీ, ఆసియాఖండానికీగూడా చాలా అవసరం. పడమటి సీమ రానురాను పరమఘాతకమైపోతున్నది. అధికార వ్యామోహమూ, ఐశ్వర్య ...

... ప్రమాదాన్ని తెలుసుకొన్నారు. పరిష్కారాలకోసం వారందరూ కొటాలు కలుస్తున్నారు. అయినా, వారి యీ కష్టాలకు ఆదికారణమేమో వారు గ్రహించారా అన్నదే నాకు సందేహం.

మొట్టమొదటి ప్రపంచ సంగ్రామం ముగిసినతర్వాత ఓటమి పాలైన జర్మనీ జారిస్టు రష్యా తాలూకు గొప్ప నవలాకారుడైన ట్రాట్‌స్కోస్కీ వేదాంతానికీ, చైనా-భారతదేశాల తత్వాలకూ దిగింది. ...

## లేఖలు

### బండిపట్టాల కఱవు

బెజవాడ తాలూకాయందలి రైతులు పరికరహీనులై పల్లు బాధలకు గురియగుచున్నారు. వారికి చాలమందికి బండిపట్టాలు దొరకుటలేదు. చాలమంది రైతులు పట్టాలకొరకు దరఖాస్తులుపెట్టి 4, 5 మాసములు కావచ్చినది. ఆఫీసుకు వెళ్లి దరియాప్తుచేస్తే యింకా శాంక్షన్ కాలేదని చెప్పుచున్నారు. సంవత్సరం క్రితమే దరఖాస్తులు పెట్టినవారికిగూడ పట్టాలు వచ్చుటలేదు. ఇంకెన్ని సంవత్సరములకు పట్టాలను మంజూరుచేస్తారో తెలియదు. భూములకు ఎరువులను తోలుకొను సమయముగూడ దాటుచున్నది. రాబోవునది వర్షాకాలము. అవుసరమైన కాలములో పట్టాలందకపోతే రైతు చాల బాధలకు గురియగును. ఈసంగతి ప్రభుత్వమువారికి గూడ తెలుసు. పైగా ప్రతిపల్లెలో రేపు నింపుపెట్టి అధికాహారోత్పత్తి చేయుమని సలహాలను చాటుచున్నారు. ఈవిధముగా రైతునకు కావలసిన పరికరములను సకాలమునకు సప్లయిచేయనిది భూమిని ఎట్లు సారవంతే మొనర్చి, అధికాహారోత్పత్తి గావించి జీవకోటులను బ్రతికించగలరు? ఇటువంటి కరువుదినములలో ఒకజతబండి పట్టాల కొరకు రైతుప్రజ ఎంతోదూరము నుండి యీ బెజవాడ పట్టణమునకు వేంచేసి హోటలులలో అర్థకాదుతిని ఆఫీసు ...

## ఏజెన్సీప్రదేశము - ఆహార సమస్య

# వారఫలాలు

శ్రీ రావినూతల ఆంజనేయులు

[లగ్న ఫలములను జన్మలగ్న, చంద్ర (గోచార) లగ్నముల ననుసరించి గ్రహించునది. దశాభుక్తుల ననుసరించి ఫలితములు మారవచ్చును. గాన పరమ ప్రమాణములుగ నెంచరాదు.]

జూలై 7 వ తేది మొదలు
13 వ తేదీ వరకు

### గ్రహస్థితి

రవి, (మిథునం) కుజశుక్రుడు (సింహం) బుధ, శనులు (కటకం) గురువు (కన్య) రాహువు (వృషభం) చంద్రుడు (గుం, వృశ్చిక, ధనుస్సుల్లో)

ధరలు

ప్రత్తి (జోరిల్లా) నూలు: వస్త్రాలు

క్రమేణా తేజీ, తగ్గినప్పుడంతా కొనడం లాభకరం. నూలూ, వస్త్రాలూ నిలిచి యుంటవి.

### వెండి-బంగారాలు

చలామణి అస్థిరము. 11 వరకు స్వల్ప మంది. 12-13 తే. జీ.

### వాటాలు

[?]మార్కెట్టు గమనించి యుండండి. వారాంతంలో శీఘ్రంగా హెచ్చే సూచన లున్నవి.

### ధాన్యములు - ఆహారవస్తువులు

పొట్టుధాన్యములూ (వరి, గోధుమలు). నూనెలూ, వేరుశనగ, అవిసెలూ స్వల్ప వ్యత్యాసాలతో నిలచియుంటవి. మధురాహార పదార్థములు హెచ్చును. మసాలా వస్తువులు కొంచెము తగ్గును.

### లగ్న ఫలాలు

**మేషం** (అశ్విని, భరణి, కృత్తిక 1 పాదం)

ఈ వారంలో ముఖ్య కార్యక్రమం 11 సాయంత్రంవరకు నిర్విఘ్నంగా సాగును. 7, 8 ప్రయాణం లాభకరం. వ్యాపార వ్యవహారాల్లో తారుమారు కలిగి చిన్నరకు సర్దుకో కలుగుతారు. మిత్రులతో విలాస విహారాలతో కులాసాగా కాలం గడుప కలుగుతారు. 9, 10, 11 ల్లో స్పెక్యులేషన్, పేకాటలూ లాభకరం. వారాంతంలో సమాజంలో కలహాలకూ ఆరోగ్యభంగానికి వీలుంటుంది. 9 శుభవార్త.

**వృషభం** (కృత్తిక, 2, 3, 4; రోహిణి మృగశిర 1 2 పాదాలు)

ఈ వారంలో వ్యాపార ఉద్యమాల్లో, ముఖ్య కార్యక్రమం ముగించకలుగుతారు. 7, 8 పరిష్కారాలకు 9; 10, 11 ప్రయాణం మిత్రులను సందర్శించడం కలుగుతవి. మొత్తంమీద సమాజంలో మీకు ఎదురుండదు. అనవసరంగా కుటుంబ ఆర్థిక పరిస్థితులను గురించి తీవ్రమైన యోచనలు గురి అవుతారు. వారాంతంలో స్పెక్యులేషన్ పేకాటలూ లాభకరం 8 శుభవార్త.

**మిథునం** (మృగశిర 3,4పాదాలు; ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు.)

ఈవారంలో పరిస్థితులు గతవారం కన్నా మేలుగా యుంటవి. 7, 8 మాత్రం ఓర్పు వహించడం అవసరం. 9, 10, 11 పరిష్కారాలకూ, తలంపులను కార్యక్రమంలో యుంచడానికీ, పత్రాలలో చేవ్రాళ్లకూ 12, 13 ప్రయాణానికీ మిత్రులను కలువడానికి ఇతర తేదీలకన్నా మేలు. ఆర్థికంగా మీకోరికలు వెంటనే ఫలించక పోయినా ఆశాజనకంగా యుంటవి. 9 శుభవార్త.

**కర్కాటకం** (పున 4, పుష్యమి, ఆశ్లేష)

ఈవారంలో 11 సాయంత్రం వరకూ పరిస్థితులు అంత తృప్తికరంగా యుండవు. సంభాషణలలో మీ ప్రతిమాటకూ విలువ యుంటుందనీ ప్రతిపొరపాటునూ తీవ్రంగా యెదుర్కొనవలసివస్తుందని గ్రహించి చూడండి. ఆర్థికంగా కూడా చిక్కులు కలుగుతవి. వాగ్దానంచేసినవారూ అభయహస్తం ఇచ్చినవారలు సమయానికి అగపడరు. 12; 13 ల్లో మాత్రం పరిష్కారాలూ, వ్రాతల ముగింపులూ లాభకరం.

**సింహం** (మఖ, పుబ్బ, ఉత్తర 1 పాదం)

ఈ వారంలో కుటుంబ, ఆర్థిక, పరిస్థితుల్లో మార్పు లేమీ యుండవు. సమాజిక వ్యవహారాల్లో మాత్రం కొంత జాగ్రత్త అవసరం. విజయం మీకే కలిగినా తృప్తి యుండదు. ఉద్యోగ నౌకరీల్లో మార్పులకు ప్రయత్నం చేస్తారు. కాని ఫలితం స్వల్పం. ప్రయాణం జాగ్రత్తతో చేయండి నడకలో ప్రమాదానికీ, బాధకూ అవకాశాలున్నవి. 7, 8, 9 పరిష్కారాలకు 8 శుభవార్త.

**కన్య** (ఉత్తర 2, 3, 4 పాదాలు హస్త చిత్త 1, 2 పాదాలు)

ఈ వారంలో (10, 11 తేదీల్లో స్వల్ప అనుకూల అవకాశాలు కలిగినా) వ్యాపార ఉద్యోగ పరిస్థితులు తృప్తిని కలిగించవు. ముఖ్యంగా మిత్రులతో ఘనమూ, డబ్బుఇచ్చి పుచ్చుకోవాలలో తగాదాలూ, పొరపాట్లు కలుగుతవి. ముఖ్యంగా మిత్రుడొకడు నాటున దగాచేస్తాడు. గమనించి యుండండి. ఉద్యోగనౌకరీలస్థితి గతవారమూలాగే యుంటుంది. నూతన మిత్రులు చేరుతారు.

**తుల** (చిత్త 3,4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

ఈ వారంలో 10, 11 ల్లో కుటుంబ పరిస్థితులవల్లా, అనారోగ్యంవల్లా ముఖ్య కార్యక్రమం కొంత వెనకబడినా వారాంతంలోపుగా ముగించకలుగుతారు. సారస్వత పరిశ్రమ విషయమై సంశయాలు ఎక్కువ అవుతవి. రచనలు కూడా బాగుగా సాగవు. మీ అభివృద్ధికై శ్రమించిన అంచనాలు వేస్తారు. ముఖ్యపరిష్కారాలు వారాంతంలో ప్రయాణాలూ, వ్రాతముగింపులూ ప్రథమంలో జరపడం మంచిది. 7. 12 శుభవార్త.

**వృశ్చికం** (విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)

ఈ వారంలో వ్యాపార పరిస్థితులు అంత తృప్తికరంగా నడవవు. ప్రతి ప్రయత్నంలోనూ అనుకొనే దొకటి, జరిగేది మరొకటి అవడంవల్ల నిరాశ కలుగుతుంది. ఉద్యోగ నౌకరీలలో మాత్రం ఫలితం అనుకూలం. చేతికి డబ్బువస్తుంది. కాని చాలక శ్రమపడుతారు. 7, 8, 9 ల్లో విపరీతపు ఖర్చులు. 12, 13 ల్లో కుటుంబ వ్యవహారాలా మనో వైకల్యం కలిగించకలవు. కాని సమాజం మిత్రులూ ఉత్సాహం కలిగిస్తారు.

**ధనుస్సు** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పాదం)

ఈ వారంలో 10, 11 తేదీల్లో కొంత వెనుకబడినా ముఖ్య కార్యక్రమం వారాంతానికి ముగించ కలుగుతారు. ఉద్యోగ నౌకరీల్లో మీ ప్రయత్నం ఫలిస్తుంది. వారాంతం లోపుగా స్థానచలనానికీ (ప్రయాణానికి) దూరదేశంలోని మిత్రులను కలవడానికి అవకాశాలున్నవి. డబ్బు సంచిని జాగ్రత్తగా కాపాడుకోండి. వారాంతంలో శుభవార్త. విందుభోజనం.

**మకరం** (ఉత్తరాషాఢ, 2,3 , 4 పాదాలు శ్రవణం ధనిష్ఠ, 1, 2, పాదాలు)

ఈవారంలో మీరు తలపెట్టే కార్యాలన్నీ 11 వరకూ నిర్విఘ్నంగా సాగుతవి. వ్యాపారస్థులూ, లాయర్లూ, వైద్యులూ గతవారంలోకన్నా ఎక్కువగా సంపాదించకలుగుతారు. విద్యార్థులకుకూడా తలంపులు కూడివస్తవి. సారస్వతప్రయత్నం కూడా కొంత ఫలిస్తుంది. వారాంతంలో ఆరోగ్యభంగం సమాజంలో వివాదం, 10 శుభవార్త.

**కుంభం** (ధనిష్ఠ 3, 4 పాదాలు శతభిషం పూర్వాభాద్ర 1, 2, 3, పాదాలు)

ఈవారంలో 7-8 ల్లో అనారోగ్య కారణాలవల్ల కొంత వెనుకబడినా 9 నుండి వ్యాపారఉద్యమాల్లో ముఖ్యకార్యక్రమం నిర్విఘ్నంగా ముగించకలుగుతారు. మొత్తంమీద మీరు తలపెట్టి నెరవేర్చలేనిది ఏమీ యుండవు. ప్రయాణవాంఛ ఎక్కువ అవుతుంది. 12-13 ల్లో లాభకరం. చిత్రసందర్శం, వింత వస్త్రసంపాదనా కలుగును.

**మీనం** (పూర్వాభాద్ర4వ పాదం ఉత్తరాభాద్ర రేవతి)

ఈవారంలో 11 సాయంత్రంవరకూ మీరనుకొనేదొకటి జరిగేది మరొకటి. వ్యాపారంలో తీవ్రంగా పోవడంకానీ, స్పెక్యులేషన్ కానీ వద్దు. ప్రయాణం పరిష్కారాలూ, వ్రాతలముగింపులూ వారాంతంలో జరపండి. మొత్తంమీద "కీడెంచి, మేలెంచడం" మంచిది అనేది అనుభవానికి వస్తుంది. నూతనంగా ఏమీ నిలపెట్టి చేయవద్దు. వారాంతంలో శుభవార్త.

## గంటల పంచాంగం

వ్యయ సం॥ ఆషాఢ శు॥ నవమి
1946 సం॥ జూలై 7 ఆదివారం

తి॥ నవమి రా 1-20 చి సా 6-43 వర్జ్యం రా 12 59 ల 2-46 కు.

శు॥ దశమి జూలై 8 సోమవారం

సో॥ దశమి తె 3-38 స్వా రా 9-31 వర్జ్యం తె 3 50 ల.



### నేషనల్ సెరమిక్స్ లిమిటెడ్, నెల్లూరు



ఘ. వ. మద్రాసు గవర్నరుగారు నేషనల్ సెరమిక్స్ లిమిటెడ్ ఫ్యాక్టరీని గతజూన్ 26-వ తేదీన సందర్శించినపుడు తీసిన ఫోటో. ఫోటోలో ఉన్నవారు ఎడమ ప్రక్కనుంచి వరుసను వి. బలరామరెడ్డిగారు, జి. వెంకటసుబ్బారెడ్డిగారు, జె. డబ్ల్యు. బ్రౌన్‌గారు, (గవర్నరుగారి ప్రైవేటు సెక్రటరీ) డి. రామారాయణింవారు, కాప్టెన్ ది ఎరల్ ఆఫ్ హాన్నన్ (ఎ. డి. సి.) ఘ. వ. సర్ ఆర్చిబాల్డు నైగారు, బాలకృష్ణచెట్టిగారు (డి. యస్. పి.), ఎ. శంకరరెడ్డిగారు, వై. రామచంద్రారెడ్డిగారు, గోపాలరెడ్డిగారు. డైరెక్టరులను, కాళహస్తిలోని ఓరియంటల్ సెరమిక్స్‌ను నడుపుచున్న వి. రామారాయణంవారిని గవర్నరుగారి కెరుకపరచినపిమ్మట డైరెక్టరులలో ఒకరగు శ్రీ ఏ. శంకరరెడ్డిగారు గవర్నరుగారికి ఫ్యాక్టరీనంతయు చూపిరి. గవర్నరుగారును మట్టి, పింగాణీ సామానుల ఉత్పత్తివిధానమును శ్రద్ధగా గమనించిరి. గవర్నరుగారు వేసిన కొన్ని ప్రశ్నలకు సమాధానముగ శ్రీ శంకరరెడ్డిగారు నేషనల్ సెరమిక్స్ ఫ్యాక్టరీ గవర్నమెంటు సెరమిక్సు ఎక్స్‌పర్టుచే ప్లానుచేయబడిన దనియు, 1945 లో గవర్నరు సలహాదారగు సర్ యస్. వి. రామమూర్తిగారిచే తెరువబడిన దనియు, నాటనుంచి అతిశీఘ్రముగ అభివృద్ధిచెందిన దనియు, ఈ పరిశ్రమకు కావలసిన ముడివస్తువు లన్నియు నెల్లూరుజిల్లాలోనే లభ్యపడుట ఈ ఫ్యాక్టరీకి గల అసాధారణావకాశ మనియు, రవాణాకు అసౌకర్యము లున్నను, ఇట్టి ఫ్యాక్టరీలకు నేడు ఇంకను అవకాశములు కలవనియు, మూలధనము పెంచి కాళహస్తిలో శ్రీ డి. రామారాయణంవారిచే నిర్మింపబడుచున్న ఓరియంటల్ సెరమిక్సు ఫ్యాక్టరీని కూడ కలుపుకొనుటకును, భీమడోలులో ఒక ఫ్యాక్టరీని నిర్మించుటకును, ఈ ఫ్యాక్టరీలలో పనిచేయు కూలిజనముకు ఇండ్ల వసతులును, విద్యాసౌకర్యములను కల్పించుటకును ఏర్పాట్లు జరుగుచున్న వనియు తెల్పిరి. గవర్నరుగారు ఈ క్రొత్తపరిశ్రమ విజయవంతమగుగాకయని దీవించి, దీని అభివృద్ధికి తమ ప్రభుత్వము తప్పక తోడ్పడగల దని తెల్పిరి.

